విదూ—మీ యాశ్చర్యము విడిచి దుఃఖించుట యింతటితోఁ జాలును; నేను మీకొరకుఁ బ్రియసఖియైన వకుళావళికను జూచి దేవరవారి సందేశమును జెప్పివచ్చినాను.

రాజు—అప్పుడది యేమన్నది?

విదూ—"ఈరాజాజ్ఞచేత నేను గృతార్థురాల నయినాను. అయినను భాగ్యహీనురాలయిన యామె యిప్పుడు విధినిరీక్షించుచున్నట్లుగా దేవిగారు మరింత పదిలముగాఁ గావలియుంచి కాపాడుచున్నారు గనుక, ఆమె సన్నిధికిఁ బోవుటయే సుఖసాధ్యము కాకున్నది. అట్లయ్యును నేను బ్రయత్నము జేసెదనని రాజుగారితో విన్నవింపుము." అన్నది.

రాజు—ఓదేవా! ఓసంకల్పసంభవా! ప్రతిబంధకముతో నిండిన విషయములయందుఁ బ్రవేశపెట్టి, కన్నుమూఁకాలమైన సహింప శక్యముకానట్లుగాఁ గొట్టుచున్నావు. (విస్మయముతో)

గీ. పరమకోమలమగు నీదు బాణ మేడ?
హృదయభేదకమగుఁ బీడ యేడ? మదన!
మృదువుఁ దీక్ష్ణంబు నగుటన్న మేటివింత
వసుధ నీయందుఁ గానంగఁబడెను నేఁడు.

విదూ—ఈకార్యసాధన విషయమై నేనొక యుపాయప్రయోగము చేసినా నని దేవరకు విన్నవించుచున్నాను. కనుక నీమనస్సు దృఢముగా నుంచుకొమ్ము.

రాజు—ఓయీ! ఈ చిత్తవ్యాపారములయందు విముఖమయియున్న యీ హృదయముతో నేనీదినశేష మెక్కడఁ గడపుదును?

విదూ—క్రొత్తగాఁ బూచినమనోహరము లయిన రక్తకురువక పుష్పములను గానుకగాఁ బంపి, ఈయభినవవసంతసమయమునందు దేవరవారితోఁ గూడ డోలాధిరోహణసుఖ మనుభవింప మనసుపడుచున్నానని యిరావతి యిప్పుడే నిపుణికచేతఁ దమకు సమాచారము పంపినదిగదా? దేవరవారును అందు కొప్పుకొన్నారు గనుక మనము ప్రమదవనమునకే పోదము.

రాజు—అది సరిపడదు.

విదూ—ఎందుచేత?

రాజు—మిత్రుఁడా! స్త్రీలు సహజముగా బుద్ధికౌశలముకలవారు నేను బయి కంతలాలనము చేయుచున్నను నామనస్సు మఱియొకతెయందుఁ దగిలియున్న సంగతి నీసఖి యెట్లు కనిపెట్టకుండును?

ఘనసితంబయి నిలు పేవకాసుఁ గలిగి
బటువులైనట్టి గబ్బిగుబ్బలను దనరి
నిడుదలౌ వాలుఁగన్నులు నెఱయ నిటల
చేరవచ్చెడు నదిగో నాజీవితంబు.

మిత్రుఁడా! ఆమె పూర్వముకంటెఁ గ్రొత్తయవస్థ పొందియున్నది. ఎట్లన—

గీ. రెల్లుపువుఁబోలెఁ జెక్కులు తెల్లవాఱి
పరిమితములైన భూషణావళులఁ దాల్చి
వలరెడు వసంతమునఁ బాండుపత్రవితతి
మూఁగఁ బూఁతపట్టుకున్నలతికఁ బోలి.

విదూ—ఈమెయు నీవలెనే మన్మథవ్యాధిచేతనే బాధనొందుచుండియుండును.

రాజు—నామీఁది ప్రేమచేత నీకట్లగపడుచున్నది.

మాళ—ఈవృక్షమును లలితసుకుమారదోహదము నపేక్షించి పుష్పాలంకారము లేక యుత్కాతురనయియున్న నావలెనే శోకమభినయించుచున్నట్లున్నది. కాఁబట్టి దీనినీడచేతఁ జల్లఁగానున్న యీరాతిమీఁదఁ గూరుచుండి వేడుకతోఁ బ్రొద్దుపుచ్చెదను.

విదూ—ఆమె యుత్కాతురనయి యున్నానని చెప్పుచున్నది విన్నావా?

రాజు—ఇంతమాత్రముచేత నీయూహ సరియయినదని నేనెంచను. ఎందుచేతనన—

క. కురువకకుసుమరజముం గొని,
పరశీకరముల ధరించి, వంచి చిగుళ్ళన్,
దరుణుల నిష్కారణముగ
మరియాతురఁ బెట్టవచ్చు మలయానిలుఁడున్.

మాళ—(కూరుచున్నది.)

రాజు—మిత్రుఁడా! మన మీతీఁగెలచాటున దాఁగియుందము రమ్ము.

విదూ—దూరమున నిరావతివలెఁ గనఁబడుచున్నది!

రాజు—పద్మలతను జూచినయేనుఁగు మొసలిని లక్ష్యముచేయదు. (అని మాటుచున్నాఁడు.)

మాళ—ఓహృదయమా! నేను నిరాధారను గనుక దుర్లభమైనయీకోరికను విడుము. నన్నేల నీవాయాస పెట్టెదవు?

విదూ—(రాజునంకఁ జూచుచున్నాఁడు.)

రాజు—ప్రేమయొక్క మహిమ చూడుము.

గీ. పలుకవు నిమిత్త మామనోవ్యథకు నీవు,
తత్త్వమరయంగ నూహకుదరముకాదు;
లలనకో! యెట్లయిన నీవిలాపమునకుఁ
గారణము నేనయందు నిక్కముగఁ దలఁతు.

విదూ—దేవా! ఇప్పుడే మీసంశయము నివర్తియగును. నేను మీమదనసందేశమును జెప్పినబకుళావళిక యొంటిగానీలాగున వచ్చుచున్నది.

రాజు—అది ప్రార్థన మఱచిపోయినదేమో!

విదూ—ఇప్పు డాబానిసపోఁతువు మహత్తరమయిన దేవరవారిసందేశము నేలు మఱచును?

[పాదాలంకారములతో బకుళావళిక ప్రవేశించుచున్నది.]

బకు—నాసఖికి క్షేమమా?

మాళ—ఓహో! బకుళావళికా! వచ్చితివా? నీకుస్వాగతము. కూరుచుండుము.

బకు—(కూరుచుండి) ఓసీ! నీవిప్పుడు యోగ్యమయినపనికినియమింపఁబడినావు. నీకాలొకటి నావంకఁజాపుము, లత్తుకపెట్టి నూపురము తొడిగెదను.

మాళ—(తనలో) ఓహృదయమా! యీవైభవము లభించినదని సంతోషింపఁబోకుము. నాకీదుర్దశ యెట్లు తొలఁగును? కానిమ్ము. నాకిదే మరణాలంకారముకాఁ గలదు.

బకు—నీలో నీవేమియాలోచించుచున్నావు! దేవిగారీకాంచనాశోకమిప్పుడు పుష్పించునాయని యాతురపడుచుండుటగదా?

రాజు—ఏమీ! ఈప్రయత్నమంతయు నశోకవృక్షదోహదము నిమిత్తమా?

విదూ—ఏమీ? దేవిగారు కారణము లేకయీయంతఃపురాభరణములతో నీపె నలంకరింప నియమించియుండదని మీకుఁ దెలియదా?

మాళ—(కాలుచాఁచి) సఖీ? ఇప్పుడు కాలికి నొప్పి కలుగనీకుము.

బకు—సఖీ? నీవు నాశరీరమవేకదా?

(అనిపాదాలంకారము చేయునట్లు నటించుచున్నది.)

రాజు—గీ. సఖుఁడ! చూడుము ప్రియురాలి చరణమునకు
లేఁతగానిడ్డ లత్తుకలేఖ యదిగో
హరునిచేదగ్ధమైన యనంగవృక్ష
మునకుఁ దొలిపల్లవం బనఁబొలుచు మాకు!

విదూ—దేవిగారీమెకు నియమించినపని యీపాదమునకుఁ దగియున్నది.

రాజు—నీవు దక్కఁగా చెప్పినావు.

ఇరా—(శంకను గనఁబఱిచి) ఇది మాళవిక యుండఁదగినచోటుకాదు. నీవే మనియూహించెదవు?

నిపు—ఉయ్యేలనుండి పడుటచేతఁ గాలు నొప్పిపెట్టినదయి దేవిగారు తమ దోహదకార్యమునకు మాళవికను నియోగించిరనియూహించెదను. అట్లుకానియెడల దేవి తానుధరించుకొనెడి యీయందెలజతను బరిజనము పెట్టుకొనుటకెట్లు నియమించును?

ఇరా—ఇది దీనికి గొప్పగౌరవము.

నిపు—నీవురాజుగారి నేల వెదకవు?

ఇరా—సఖీ! నాపాదములు ముందుకు నడువకున్నవి. నామనస్సు కళవళపడుచున్నది. ఈలోపల నాజంకు తీర్చుకొనియెదను. (అని మాళవికనుజూచి తనలో) నామనస్సులో భీతికలుగుటకు హేతువు లేకపోలేదుకదా?

వకు—(పాదమునుజూచి) ఏమి? ఈలత్తుకరేఖలను దీర్చుట నీకింపుగానున్నదా?

మాళ—నాకాలిమీఁద నుండుటచే దీనిని నేను బ్రశంసించుటకు లజ్జపడుచున్నాను. ఈశిల్పకళాకౌశలమును నీవెవరివద్ద నేర్చుకొన్నావు?

వకు—నేనిప్పుడు రాజుగారి శిష్యురాలను.

విదూ—నీవిప్పుడు గురుదక్షిణము పొందుటకు వేగిరముగమ్మా.

మాళ—అదృష్టవంతురాలనని గర్వపడఁబోకు.

వకు—ఉపదేశమునకుఁ దగినపాదము లభించినదిగనుక నేనిప్పుడు గర్వమునే పొందెదను. (లత్తుకరచనను చూచి తనలో) నాపని నేను జక్కఁగా నిర్వహించితిని. (ప్రకాశముగా) సఖీ! నీపాదమున నొకదానికి లత్తుకపెట్టుట యయినది. ఇఁక నొకటిలో నూఁదిపడి యార్పవలెను. అక్కఱలేదు. ఆపని యిక్కడిగాలియే చేయుచున్నది!

రాజు—మిత్రుఁడా! చూచుచూడు.

గీ. పచ్చిలత్తుకచేఁ దడిపాయకున్న
పాదమంటంగ నాముఖవాయువునను
జక్కఁగానూఁది తగుసేవసలుపనాకు
నుత్తమంబైన యవకాశ మొదవెనిపుడు.

విదూ—మీకీచింతయేందుకు? ఈసేవమీకుఁ జిరకాలమనుభవింప లభించును లెండి.

వకు—సఖీ! నీపాదము కెందామరవలె శోభిల్లుచున్నది. నీవిప్పుడు సర్వథా రాజుగారియొడిలోఁ జేరుదానివలె నున్నావు.

ఇరా—(వకుళావళిక ముఖముకేసి చూచుచున్నది.)

రాజు—ఇది నాకాశీర్వాదము.

మాళ—ఓసీ! అవినయవాక్యములు పలుకకు.

వకు—నేను బలుకఁదగినదానినే పలికినాను.

మాళ—అట్లయిన, నేను నీకుఁ బ్రియురాలను గానా?

వకు—నాకుమాత్రమే కాదు.

మాళ—మఱి యెవరికిఁ గూడ?

వకు—గుణగ్రాహులయిన రాజుగారికిఁ గూడ?

మాళ—నీవు మాయమాటలు చెప్పుచున్నావు. నాయందట్టిగుణ మేదియు లేదు.

వకు—సత్యము. నీయందుఁ గాదు. నాకది కృశించి తెల్లపాఱిన రాజుగారి సుందరాంగములయందుఁ గనఁబడుచున్నది.

నిపు—మొదట గుణించుకొనివచ్చినట్టి యీచెడుపడఁతుక యుత్తరము చెప్పుచున్నది!

వకు—అనురాగ మనురాగముచేతనే పరీక్షింపఁదగిన దన్నసుజన వాక్యమును బ్రమాణము చేసికొమ్ము.

మాళ—నీవేల ఇచ్చవచ్చినట్లెల్లను వదరెదవు?

వకు—కాదు కాదు. ప్రేమచేత కృశులయిన యువిమువారియొకరినొకటిననుడి వచ్చిన రాజుగారివాక్యము లేదుమా?

మాళ—సఖీ! దేవిని దలఁచుకొని నాహృదయమీమాటలను విశ్వసింపకున్నది.

వకు—ఓసిముద్దరాలా! తుమ్మెదబాధ యున్నదని వసంతకాలమునఁ గలిగిన క్రొమ్మామిడిపూ వలంకరింపఁగూడదాయేమి?

మాళ—దుర్లభపదార్థాపేక్ష పొందియున్నదాను నీవుసహాయురాలవగుదువా?

వకు—నేను మర్దించినకాలఁదిని బరిమళించు వకుళావళికను జుమా.

రాజు—మేలు! వకుళావళికా! మేలు!

ఉ. భావమెఱుంగనైనపిదపం దగఁ బ్రస్తుతవాక్చయంబులన్,
కేవలముం దిరస్కృతి జనించిన చో నుచితోత్తరంబులన్,
జీవమొయిన్న వేదనము చేసె మదీయనిదేశ మిచ్చుటన్;
జీవములిట్లు దూతికలచేతను యుండును గాముకాళికిన్.

ఇరా—సఖీ! వకుళావళిక మాళవికచేత నీకార్యమునం దడుగుపెట్టించినది చూచితివా!

నిపు—అమ్మా! నిర్వికారులకయినను గాముకోచితమైన యుపదేశము వాంఛను బుట్టించును.

ఇరా — నా హృదయముయొక్క శంక తప్పక తీరవలసినదే. ఇప్పుడు సంగతి తెలిసినందునఁ గర్తవ్య మాలోచించెదను.

వకు — ఇదిగో నీ రెండవపాదముకూడ నలంకరింపఁబడినది. ఇప్పుడందెలను నీరెండు కాళ్లకును దొడిగెదను. (అందెలుపెట్టుట నభినయించుచున్నది.) సఖీ! లెమ్ము. ఆశోకమును పుష్పింపఁజేయుటకయి యిఁక దేవిగారియాజ్ఞ నడుపుము.

(ఇద్దఱును లేచుచున్నారు.)

ఇరా — దేవిగారి నియోగమని విన్నాము. ఇప్పుడదిజరగనిమ్ము.

వకు — ఇదిగో రాగాధిక్యముగల నీవనుభవింపఁదగిన వానిరూపము నీయెదుటనే యున్నదే.

మాళ — (సంతోషముతో) భర్తాయేమి?

వకు — (చిఱునవ్వుతో) భర్త కాఁడు. ఈయశోకమున వ్రేలుచున్న యీ లేఁజిగురు జొంపములను కర్ణాభరణముగాఁ జేసికొమ్ము.

మాళ — (విషాదమును నటించుచున్నది.)

విదూ — ఏమి? దేవరవారు విన్నారా?

రాజు — మిత్రుఁడా! ఇంతతోనే కాముకులయభీష్టము సంపూర్ణమగును.

చ. ఒకరికిఁ బ్రేమయుండి మఱియొక్కరికిం దగుప్రేమలేనివా
రికి వడిఁ బొందుకల్గినను శ్రేష్ఠముకాదది; యంతకంటెనున్
బ్రికటసమానురాగులగువారల కామరణంబు నొందొరున్
వికలతఁగూడ నబ్బుటయె పెద్దసుఖంబు మేలుగనెంతు నామదిన్

మాళ — (చిగురాకును కర్ణాభరణముగా ధరించుకొని విలాసముతో నశోకమును దన్నుటకు పాదమెత్తుచున్నది.)

రాజు — మిత్రుఁడా!

గీ. పాదపమునుండి గ్రహియించి పల్లవంబు
మరలఁ బాదపల్లవమిచ్చె బ్రాఁకునకును;
కోరియుభయులు నిటుమార్చుకొనుటచేత
వంచితుఁడనైతినిప్పు డేనందు దలఁతు.

మాళ — ఈయశోకము పూచుటకయి చేయవలసినదో పాదము నేను వేసితిని గదా? ఇట్లు చేసినతరువాతఁగూడ నిది పుష్పింపకుండునేమో?

వకు — సఖీ! ఇఁక నీలోప మేదియు లేదు. నీచరణసత్కారమును బొందియు శీఘ్రముగాఁ బూఁత పట్టకపోయినపక్షమున నీయశోకవృక్షమే నిర్గుణ

రాజు—ఉ. ఈతనునుధ్యయంత్రియుల నింపగునాదము పుట్టఁగా నబ్
జాత సమానకోమలకుపాదమున న్నిను సత్కరించెఁ దన్
బూఁతను బట్టుకన్న, నిటఁబొల్చి యశోకమ! చారురూపశో
భాతుల నాయకార్హ మగు నాదరమున్ వృథగాదెనీ మొదల్?

మిత్రుఁడా! నేను బోయి యవకాశము చేసికొని మాటాడఁగోరుచున్నాను.

విదూ—రమ్ము. నేనిప్పుడు వారిని భయ పెట్టెదను.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

నిపు—అమ్మా! అమ్మా! రాజుగారు ప్రవేశించుచున్నారు.

ఇరా—నేనిది మనస్సులో మొదటనే యాలోచించినాను.

విదూ—(చేరఁబోయి) అమ్మా! రాజుగారెదుటనుండఁగా దేవిగారికి బ్రియముమైన యీయశోకవృక్షమును ఎడమకాలితోఁ దన్నుట నీకుఁ దగునా?

ఇద్దఱు—(తొట్రుపాటుతో) అయ్యో! రాజుగారిక్కడ నేయున్నారే!

విదూ—వకుళావళికా! ఈమె తెలియక యవినయకార్యము చేయుచుండఁ దెలిసినదానవు నీవు దాపుననుండి యెందుకు వారించినావు కావు?

మాళ—(భయము కనఁబఱచుచున్నది.)

నిపు—అమ్మా! మహానుభావుఁడైనయీ గౌతముఁడేమిచేయుచున్నాఁడో చూడు.

ఇరా—ఇట్లుగాక పోయిన మఱియే బ్రాహ్మణాధముఁడు జీవనము చేయఁ గలుగును?

వకు—అయ్యా! ఈమె దేవిగారి యాజ్ఞాప్రకారమే చేయుచున్నది. ఈయతిక్రమమునందీమె పరాధీనురాలు, రాజుగారు క్షమింతురుగాక! (అని తాను మ్రొక్కి మాళవికచేత మ్రొక్కించుచున్నది.)

రాజు—అట్లయినపక్షమున నీయందుఁ దప్పిదములేదు. కళ్యాణీ! లెమ్ము. (అని చేతితోఁ బట్టుకొని మాళవికను లేవదీయుచున్నాఁడు.)

విదూ—ఇది తగును. దేవిగారు మాననీయురాలుగదా?

రాజు—(నవ్వి) క. జవ్వనిరో! కఠినంబగు
నివ్వసుధారుహము మొదల నిటు మోపుటచే
నొవ్వదె కిసలయకోమల
మివ్వామపదాంబుజాత మిప్పుడు నీకున్?

మాళ—(లజ్జ నభినయించుచున్నది.)

ఇరా—(అసూయతో) ఓహో! భర్తగారు నవనీతకోమలహృదయులు గదా

మాళ—వకుళావళికా! తరునియోగమును నెరపితిమని దేవిగారికి నివేదింతము రమ్ము.

వకు—సెలవుపుచ్చుకొనియెదనని రాజుగారికి విన్నపము చేయుము.

రాజు—కళ్యాణీ! నీవు పోవచ్చును. సమయము దొరకినదిగనుక ముందుగా నిప్పుడు నా ప్రార్థనను వినుము.

వకు—అవహితురాలవై వినుము—దేవర వారానతిత్తురుగాక!

రాజు—గీ. ఈవిధమున నెయింతిరో! యాశకీర
ములరోదనకుండఁ జిరకాలమునుండి;
నీదుస్పర్శామృతంబున నెఱపుమిందు
నన్యమెల్లని నాకు దోహదము నిపుడు.

ఇరా—వేగముగా (సమీపించి) ఈయనకవశ్యము గాదోహదము చేయుము. అశోకము పూలనుమాత్రమే యిచ్చునుగాని యీయన పూవులను ఫలములనుగూడ నిచ్చును.

[అందఱును ఇరావతినిజూచి తత్తరపడుచున్నారు.]

రాజు—(రహస్యముగా) మిత్రుఁడా! ఇప్పుడేమిగతి?

విదూ—మఱియేమున్నది? పిక్కబలమే.

ఇరా—మేలు! వకుళావళికా! మేలు! ఇప్పుడు నీవు మంచిపనికిబూనుకొన్నావు. మాళవికా! భర్తగారికోరికను సఫలము చేయుము.

ఇద్దఱు—అమ్మా! క్షమింపుము. రాజుగారి ప్రణయపరిగ్రహమునకు మేమెవరము?

(అని వెడలిపోవుచున్నారు.)

ఇరా—పురుషులను నమ్మఁగూడదు. నీమాయమాటలు నమ్ముటచేతఁ బ్రియభాగ్య నయియుండి తిరస్కృతురాల నయిన నాకిప్పుడిది హృదయశల్యమయినది. వేఁటకాని గీతముచేత ననుమానపడక యాకర్షింపఁబడిన లేడివలెనే నావినాశము నేను దెలిసికొ లేకపోతిని.

విదూ—(రహస్యముగా) మిత్రుఁడా! ఏదో యుత్తరము నాలోచింపుము. నీకుఁ జెప్పవలసినదేమున్నది? సీటిసమీపమున చారిలేక పట్టుపడిన దొంగవలెనే యిప్పుడు సంధి చేసికొనుటయే కర్తవ్యమని తోఁచుచున్నది.

రాజు—సుందరీ! నాకు మాళవికతోఁ గొంచెమయినను బనిలేదు. నీవాలస్యము చేసినందున, వీరితో నేను గొంచెము వినోదముగాఁ బొద్దుపుచ్చుచున్నాను.

ఇరా—మిమ్ము నమ్మఁగూడదు. భర్తగారికిటువంటి వినోదము దొరకిన సంగతి నాకుఁ దెలిసినదికాదు. అట్లు తెలిసియుండినయెడల నేనీవిధముగా మీకు వినోదభంగమును జేసియుండను.

విదూ—ఇప్పుడు రాజుగారి దాక్షిణ్యము చెడఁగొట్టుకొనుము. సమీపమునఁ గనఁబడినప్పుడు రాణిగారి పరిచారికలతోడ సంభాషించుటకూడఁ దప్పగునా? నీవే చెప్పు.

ఇరా—వారితోడి సంభాషణమే జరగనిమ్ము. నేను నామనస్సు నేలయూరడఁ బెట్టుకొనవలెను? (అని రోషముతో బయలువెడలుచున్నది.)

రాజు—(వెంబడించి) ప్రాణేశ్వరీ! శాంతింపుము.

ఇరా—(ఒడ్డాణము జారి కాలికిఁ దగులుకొనఁగా నడుచుచున్నది.)

రాజు—సుందరీ! ప్రేమగలవారిని నిరాదరించుట యుక్తము కాదు.

ఇరా—ధూర్తా! నీవు నమ్మఁదగినవాఁడవు కావు.

రాజు—గీ. 'ధూర్త' యనుమాటతోనె యో తోయజాక్షి!
యనఁగుదయిన నాపయి కోప మాఱఁ జెల్లు;
కార్శ్యపయిన్యాలి నిన్ను మేఖలయు వేఁడఁ
జండి! కోపంబు విడువంగఁ జాలవేమి?

ఇరా—ఈ చెడు మేఖలయును నిన్నే యనుసరించుచున్నది. (అని మొలనూలు పుచ్చుకొని దానితో రాజును గొట్టఁబోవుచున్నది.)

రాజు—మిత్రుఁడా! ఈ యిరావతి

గీ. కానునండి యుపేక్షతోఁ గగను జాఱు
పసిఁడి మొలనూలితోడ బాష్పములు కాఱ
నుగ్రురాలయి నను గొట్టనుద్యమించె
మొయిలు మెఱుముతో వింధ్యాద్రి మోఁదునట్లు.

ఇరా—ఏమి? ఈవిధముగా నన్ను మరలఁ దిరస్కారము చేయుచున్నావా? (అని మొలనూలితోడి చేయి తీసికొనుచున్నది.)

రాజు—క. అపరాధి నయిన నాపయి
నిపు డెత్తినదండ ముడిచె దేల? లతాంగీ!
యిపుడు విలాసము పెంచియుఁ
గుపితత్వము దాచునందుఁ గూర్చెదవో? కటా.

ఇప్పుడు నీకోపము తగ్గింపుము. (అని పాదములమీఁద బడుచున్నాఁడు.)

ఇరా—నీకు సంతోషకరమయిన వాదము చేయుటకివి మాళవిక పాదములు కావు. (అని చేటికతోఁ గూడఁ బోవుచున్నది.)

విదూ—లెమ్ము. నీవనుగ్రహింపఁబడినావు.

రాజు—(లేచి యిరావతినిగానక) ఓహో! నాప్రియురాలు వెడలిపోయినదా!

విదూ—మిత్రుఁడా! దైవవశముచేత నవినయుఁడవైన నన్ను వృథ విడిచిపోయిన నను దానికోపమింకను దీఱలేదు. అంగారరాశివలె నీమె మరల రాకమునుపే మనము శీఘ్రముగాఁ బాఱిపోవుదమురమ్ము.

రాజా—ఆహా! కాముని వైషమ్యము!

గీ. మనసు ప్రియురాలిపైఁ జిక్కుకొనిన నేను
నేవగవనెంతు మొక్కినఁ దేకొనమియు;
కూర్మిగలవయ్యు నామీఁదఁ గుపితయగుట
చేత నేను నిప్పుడుపేక్ష చేయవచ్చు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

# చతుర్థాంకము.

[అప్పుడు విచారగ్రస్థుఁడయి రాజును, ప్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.]

రాజా—(తనలో)

చ. చెవులనుబడ్డ కాంతపయిఁ జేయుచు వేరది నాటియాశచే,
నవలను రాగపల్లవము గందుచు దృష్టికిఁ గానిపించుటన్.
దవిలి కరంబు పూచినవిధంబ మరం బులకాంకురాళిచే,
జవమున గామవృక్షము రసజ్ఞుని నన్ ఫలమొందఁ జేయుతన్.

(ప్రకాశముగా) మిత్రుఁడా! గౌతమా!

ప్రతీ—దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! గౌతముఁ డిక్కడ లేడు.

రాజా—(తనలో) అయ్యో! అతఁడు మాళవిక వృత్తాంతము తెలిసికొని వచ్చుటకయి నాచేతఁ బంపఁబడినాఁడుగదా!

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—మీకు జయమగుఁగాక! జయమగుఁగాక!

రాజా—జయసేనా! ధారణీదేవి యెక్కడనున్నదో కాలినొప్పిపోవుట కెట్టి వినోదము పెట్టఁబడుచున్నదో తెలిసికొనిరమ్ము.

ప్రతీ—దేవరయాజ్ఞాపరిపాలనము చేసెదను. (అనిపోవుచున్నది.)

రాజా—గౌతమా! నీసఖురాలయిన యామెవృత్తాంతమేమి?

విదూ—పిల్లిచేతఁ బట్టుపడిన కోకిలవృత్తాంతమువలె నున్నది.

రాజా—(విషాదముతో) ఎందుచేత?

విదూ—భిన్నురాలయియున్న యామె కన్నులనిగ్గులొలుకు దేవిచేతఁ బాతాళ గృహమునఁ ద్రోయఁబడినది.

రాజు—నన్నుఁ దారసించినందుకుఁ గాఁబోలును.

విదూ—అవును.

రాజు—ఈవిధముగా శత్రువులెవరు దేవిగారికిఁ గోపము తెప్పించినారు?

విదూ—దేవా! వినుము. కాలినొప్పిచేత బాధపడుచున్న దేవిగారి క్షేమవార్త యడుగుటకయి యిరావతి యక్కడకుఁబోయియుండెనని పరివ్రాజిక నాతోఁ జెప్పినది.

రాజు—అటుతరువాత?

విదూ—మనప్రియవల్లభుఁడేల దర్శనమియ్యలేదని దేవి యడిగినది. "మన ప్రియవల్లభుఁడేమి? ప్రియవల్లభత్వము మనపరిజనము పాలయినట్లు మీకింకను దెలియలేదా?" అని దానికామె యుత్తరమిచ్చినది.

రాజు—అయ్యో! ఈయుపన్యాసమువలన మాళవికమీఁదనే యనుమానము పోయినదని చింతిల్లుచున్నాను.

విదూ—అటుతరువాత దేవి నిర్బంధపెట్టి యామెవలన నీయుదంతము నంతయుఁ దెలిసికొన్నది.

రాజు—ఏమి దానిదీర్ఘరోషము! అటుపిమ్మట జరిగినది చెప్పు.

విదూ—మఱియేమున్నది? మాళవికయు బకుళావళికయుఁ గాళ్ళసంకెళ్ళతో నాగకన్యకలవలె సూర్యకిరణములు చొరని పాతాళగృహనివాసము ననుభవించుచున్నారు.

రాజు—అయ్యో! పాపము!

గీ. మధురముగఁ గూయుపికమును మధుపసఖియుఁ
పెద్దగాలితోడి యకాలవృష్టిచేతఁ
గుసుమితంబగు క్రొమ్మావిగున్న విడిచి
తొఱ్ఱచేరంగ వలసెఁగా తోడులేక.

మిత్రుఁడా! ఇక్కడ మనమేమైనఁ జేయుట కవకాశమున్నదా!

విదూ—ఏమియవకాశమున్నది? నాముద్రయుంగరము నీకుఁ జూపినంగాని మాళవికను బకుళావళికను విడువవలదని దేవిగా రాణివాసపాలకుఁ గావలిపెట్టిన మాధవికకు గట్టియుత్తరువు చేసినారు.

రాజు—(నిట్టూర్పువిడిచి విచారముతో) మిత్రుఁడా! ఇక్కడ జేయవలసిన పనియేమి?

పరి—(కోపముతో పట్టుకొనుచున్నది.)

విదూ—(రాజునుజూచి) నీకు నేను బాల్యమునుండియుఁ బ్రియమిత్రుఁడనుగా నున్నాను. ఇప్పటి ప్రేమను మఱువక నా హీనుండగు నా కొడుకును మా యిల్లాలిని దయతో భారము వహింపుము.

రాజా—బెదరఁబోకు. ఇప్పుడే వైద్యులు చికిత్స చేసి నిన్ను బాగు చేయుదురు. స్థిర చిత్తుఁడవుకమ్ము.

జయ—(ప్రవేశించి) ఓ మహారాజా! ధ్రువసిద్ధి దేవరవారి యాజ్ఞ నాలించి గౌతముని నక్కడకే పంపవలయునని విన్నపము చేయుచున్నాఁడు.

రాజా—అట్లయిన గౌతముని సహాయులతో నీతని ధ్రువసిద్ధియొద్దకుఁ జేర్పుము.

జయ—అలాగే.

విదూ—(దేవివంకఁజూచి) అమ్మా! నేను జీవించినను జీవించకపోయినను రాజుగారి సేవకుఁడనగుటచేత నా విషయమునఁ జేసిన యపరాధమును క్షమింపవలెను.

ధార—నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

(విదూషకుఁడును ప్రతీహారియు నిష్క్రమించుచున్నారు.)

రాజా—ఖిన్నుఁడైయున్న యితఁడు స్వభావముచేతనే పిఱికివాఁడు. ధ్రువసిద్ధి సార్థక నామము కలవాఁడయినను గుదురునని యెంచకున్నాఁను.

జయ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! నీటికుండలో వేసి చికిత్స చేయుటకయి సర్పముద్రిగల యుంగరమొక్కడైనను వెదకి సంపాదింపవలెనని ధ్రువసిద్ధి యేలినవారితో మనవి చేయుచున్నాఁడు.

ధార—సర్పముద్రిగల యుంగరమిక్కడనే యున్నది. ఇదిగో దీనిని బనిదీరిన తరువాత మరలఁ దెచ్చి నా చేతికిమ్ము. (అని జయసేనకిచ్చుచున్నది.)

రాజా—జయసేనా! పని కాఁగానే శీఘ్రముగాఁ దీసికొనిరమ్ము.

జయ—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను. (అని వెడలిపోవుచున్నది.

పరి—గౌతమునికి విషము దిగినదని నా మనస్సునకుఁ బొడకట్టుచున్నది.

రాజా—అట్లే జరుగునుగాక!

జయ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! గౌతముని విషవేగము తగ్గినది. అతఁడు ముహూర్తకాలములో మరల నెప్పటివాఁడయినాఁడు.

ధార—భాగ్యవశముచేత నేను నిందనుండి విముక్తురాలనయినాను.

జయ—ఆలోచింపవలసిన రాజకార్యము లనేకములున్నవిగనుక దర్శన మనుగ్రహింపఁగోరుచున్నానని మంత్రి వాహతకుఁడు దేవరవారితో విన్నపము చేయుచున్నాఁడు.

ధారి—దేవరవారు కార్యపర్యాలోచనముతోడను విజయముం జేయవలెను.

రాజా—దేవీ! ఈప్రదేశమున నెండసోకుచున్నది. ఈబాధకు శీతలోపచారము పరిక్లుప్తము. కాఁబట్టి నీపాదమును మెత్తనుకచోట నుంచుకొమ్ము.

ధారి—ఓపరిచారికలారా! మీరుభర్తగారు సెలవిచ్చినప్రకారము చేయుఁడు.

పరిచారికలు—మంచిది. (అని అప్రకారముగా చేయుచున్నారు.)

[ధారణీదేవియు, పరివ్రాజికయు, పరివారమును, పోవుచున్నారు]

రాజా—జయసేనా! గూఢమార్గమునఁ బ్రమదవనమునకుఁ దీసికొనిపొమ్ము.

జయ—దేవా! ఇటురండు.

రాజా—జయసేనా! గౌతముఁడు తనకుశిష్టమును నెఱవేర్చినాఁడుగదా?

జయ—నిస్సందేహముగా.

రాజా—క. ఇష్టావాప్తికిఁ గడు ను
త్కృష్టం బీక్రియ యటంచు నెఱిఁగియుఁ గష్టం
బిష్టార్థసిద్ధియందును
స్పష్టముగా మనసు జంకుపడియెడు నాకున్.
[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—మీకు జయమగుఁగాక! జయమగుఁగాక! దేవరవారి మంగళకార్యములు సిద్ధిపొందినవి.

రాజా—జయసేనా! నీవుకూడ నీపనికిఁబొమ్ము.

జయ—దేవరవారాజ్ఞాపించినట్లుచేసెదను. (అనిపోవుచున్నది.)

రాజా—గౌతమా! ఇప్పుడు ఘునుశాలయిన మాధవిక కొంచమయిన ననుమానపడలేదా?

విదూ—దేవిగారి ముద్రయుంగరమునుజూచి యెట్లనుమానపడును?

రాజా—నేనుంగరమునుగూర్చిమాటాడలేదు. దేవి యేహేతువుచేత వీరినిద్దఱిని విడిపించినది, తనపరిజనమును మాని నన్నేలపంపినది, అని యడిగియుండవలెను.

విదూ—నన్నది యాప్రశ్నలడిగినది. నేను మందుఁడనయినను వెంటనే సముచితమయిన ప్రత్యుత్తరమిచ్చినాను.

రాజా—ఏమని?

విదూ—జ్యోతిష్కులు రాజుగారి నక్షత్రమునకుఁ గ్రూరగ్రహబాధ కలిగినదనియు, అందుచేత నవశ్యముగాఁ జెఱలోనున్నవారినందఱిని విడిచి పెట్టింపవలయు

వనియు, రాజుగారితో విన్నపము చేసిరని నేను చెప్పితిని.

రాజు—(హర్షముతో) అటుతరువాత.

విదూ—అసంగతిని దేవి యిరావతి మనస్సునకు నొప్పి కలుగకుండుటకై "రాజుగారే విడిపింపుమన్నా" రని నన్నంపినదని చెప్పినాను. అయియుండవచ్చు. నని యందుమీఁద మాధవిక కార్యసాఫల్యము చేసినది.

రాజు—(విదూషకుని కౌఁగిలించుకొని) మిత్రుఁడా! నాయెడల నీకుఁ బ్రేమ యున్నదికదా?

గీ. బుద్ధిగుణమున నే మిత్రములకునిలను
కార్యదర్శనమిప్పుడుఁ గాదుసుమ్ము
స్నేహమునఁగూడ లభియించి నెగఁడుజావె
కార్యసిద్ధికి మూఁడుమార్గంబు లప్పుఁడ.

విదూ—మీరు త్వరపడవలెను. సఖీసహితురాలయిన మాళవికను సముద్ర గృహమునందుంచి మీనిమిత్తమయి యెదురుగా వచ్చినాను.

రాజు—నేనామెను గౌరవించెదను. నీవు ముందు నడువు.

విదూ—దేవా! రండి రండి. (అనికొంచెము నడిచి) ఇదిగో సముద్రగృహము.

రాజు—(భయముతో) మిత్రుఁడా! అదిగో చేతులతోఁ బూవులఁగోయుచు నీయిష్టురాలయిన యిరావతిపరిచారిక చంద్రిక మనవైపునకే వచ్చుచున్నది. ఇప్పుడది పోయినదాఁక మనమీగోడచాటున దాఁగుకొందము.

విదూ—విదూ—ఓహో! చోరులకును జారులకును చంద్రిక సరిపడదుగదా?

(ఇద్దఱును చెప్పినట్లు చేయుచున్నారు.)

రాజు—మిత్రుఁడా! నీచెలి నానిమిత్తమయి యెదురుచూచుచుండును. ఈ గవాక్షమునుజేరి యామెనూ జూతమురమ్ము.

విదూ—ఆలాగే. (ఉభయులును నిలుచుండి చూచుచున్నారు.)

[అప్పుడు మాళవికయు వకుళావళికయుఁ బ్రవేశించుచున్నారు.]

వకు—సఖీ! భర్తగారికి మ్రొక్కుము.

మాళ—ఓభర్తా! నీకు నమస్కారము.

రాజు—వకుళావళిక నాప్రతిరూపమును నిర్దేశించుచున్నదనికొందును.

మాళ—(హర్షముతో ద్వారమువంకఁజూచి) సఖీ! నన్ను మోసపుచ్చుచున్నావా? (అని విషాదము చూపుచున్నది.)

రాజు—ఆమె హర్షవిషాదములకు నేను బ్రీతుఁడనయినాను.

గీ. సూర్యుఁ డుదయించుచోఁ గ్రుంకుచోఁ గరంబు
జలజము వికాస సంకోచములను దాను
బూనునట్లుగ నీపద్మముఖి ముఖంబు
క్షణములోపల రెండవస్థలను దాల్చె.

వకు—అదుగో భర్త. చిత్రపటమునం దున్నాఁడు.

ఇద్దఱు—(మ్రొక్కి) దేవా! మేలు కలుగుఁగాక! మేలుకలుగుఁగాక!

మాళ—సఖీ! అప్పుడు తొందరలో నిలుచుండి చూచుటచేత రాజుగారి రూపమునందు నాకాశయెట్లు తీఱలేదో, అట్లే యిప్పుడు రాజుగారిరూపము తృప్తికరముగా నుండలేదనియే నేను భావించెదను.

విదూ—వినుచున్నావా? నీవు కనఁబడునట్లుగాఁ జిత్రపటమునం దుండలేదని యీమె తలఁచుచున్నది. పెట్టెయందలి రత్నరాసివలెనే యిప్పుడు నీవు యౌవనగర్వమువహించుట వ్యర్థమగుచున్నది.

రాజు—మిత్రుఁడా! కుతూహలము గలవారయినను స్త్రీలు సహజముగా సిగ్గు గలవారుగానుందురు. చూడు—

చ. తరుణులు వేడ్కతోఁ బ్రథమదర్శన కాలమునందుఁ దద్దయున్
బురుషులరూపముల్ నయనముల్ తనివోవంగను జూడఁగోరియున్
ధరఁ దరళాయతాక్షులు మనఃప్రియులం దిలకించు పట్టునం
గరమునువిప్పి కన్గొనరుగా కనుదమ్ములనిండ నెప్పుడున్.

మాళ—సఖీ! మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొని భర్తగారిచేఁ బ్రేమగలచూపులతోఁ జూడఁబడుచున్న యీమె యెవరు?

వకు—పార్శ్వమునందున్న యిరావతికదా యీమె?

మాళ—సఖీ! పట్టపుదేవుల నందఱిని విడిచిపెట్టి యొక్క యీమెవంకనే ఱెప్పవాల్పక చూచుచుండుటచూడఁగా నాకు రాజుగారు దాక్షిణ్యములేనివారుగాఁ గనఁబడుచున్నారు.

వకు—(తనలో) చిత్రపటములోనున్న రాజును నిజమయినవానినిగా భావించి కాని యీమె యసూయను గనఁబఱచుచున్నది. కానిమ్ము. నేను దీనిచేఁ గొంచెము సేపు వినోదించెదను. (ప్రకాశముగా) సఖీ! భర్తగారికీమె యత్యంతప్రియురాలు.

మాళ—అట్లయిన నేనిప్పుడు నాహృదయము నేల యాయాస పెట్టుకొనవలెను!

(అని అసూయతోఁ దిరుఁగుచున్నది.)

రాజు—మిత్రుఁడా! చూడు చూడు.

ఉ. భామినిచేత బొట్టుచెడ మోవియు నిండక సంచలింపఁగా
రమణి యసూయతో మరలి ప్రక్కకువంగడు పెంపు వొల్చెడు
భ్రమణమును తప్పుచేత నిటు నాయకి కోపము చూప జెల్లునం
చమర గురుండు నేర్పు లలితాభినయంబును బట్టినట్టుగన్

విదూ—ఇప్పుడు నీ వామె ననుసరింపుమటకు సిద్ధముగా నుండుము.

మాళ—ఇక్కడ బూజ్యుఁడయిన గౌతముఁడు కూడ నీమెను సేవించుచున్నాఁడే. (అని మరల మరియొకవంకకు మరలఁబోవుచున్నది.)

వకు—(మాళవికను నివారించి) మరలవలదు. నీవిప్పుడు కుపితురాలవై యున్నావు.

మాళ—నీవు నన్ను దీర్ఘక్రోధము కలదానినిగాఁ దలఁచెదు పక్షమున నా కోపము నిప్పుడే విడిచెదను.

రాజు—(సమీపమునకుఁబోయి)

గీ. అతివ! పరిత్యక్త దాసుఁడనగు నీదు
సేవనాసాధారణవృత్తి నుండఁ
జిత్రగతుఁడనై యున్న నాచేష్టఁ జూచి
యిపుడు కోపంబు వహియించె దేల నీవు.

వకు—దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక!

మాళ—(తనలో) చిత్రపటములోనున్న భర్తగారియెడల నేనేల యసూయపడితిని? (సిగ్గుతోఁదలవంచుకొని చేతులు జోడించుచున్నది.)

రాజు—(కామచాంచల్యమును గనఁబఱుచుచున్నాఁడు)

విదూ—నీవుపేక్షాపరునివలెఁ గనఁబడుచున్నావేమి?

రాజు—నీసఖురాలియొక్క యవిశ్వసనీయతవలన.

విదూ—నీకీమెయెడ నవిశ్వాస మేలగలిగినది?

రాజు—చ. నయనపథంబుఁ జేరియు క్షణంబున నిప్పుడదృశ్యయౌను, నీ
ప్రియసఖి చేతికిం దగ లభించియుఁ జిక్కక వేగఁబోవు, నే
రయమునఁ గామపీడ నిటులాఁగ సమాగమమాయచేత, నా
ప్రియుఁడ! మదీయచిత్తమెటు వేగము యీమెను విశ్వసించెడున్?

వకు—సఖీ! రాజుగారు పలుమాఱు మోసపోయినారు. కాఁబట్టి నీవిప్పుడు విశ్వసనీయురాలవు కమ్ము.

మాళ—మందభాగ్యురాలయిన నాకు రాజుగారిపొందు స్వప్నములో సహితము దుర్లభమాయెను.

వకు—రాజా! ఈమెకుత్తరమిమ్ము.

రాజు—గీ. ఉత్తరంబియ్య నేల? కామెరాజ్యలాగ్ని
సాక్షిగా నన్నొయిపుడు నీసఖికి నేను
నర్పణము చేసికొనెద రహస్యముగను
సేవ్యుఁడను గాను నేనింక నీకకుండ.

వకు—నేననుగ్రహింపఁ బడినదాననయినాను.

విదూ—(కొంచెమునడిచి తొట్రుపాటుతో) వకుళావళికా! లేడియశోకపల్లవములను దాఁటబోవుచున్నది, దానిని దోలివత్తమురమ్ము.

వకు—మంచిది. (అని బయలుదేఱుచున్నది.)

రాజు—ఆవిధముగానే మీరు మమ్ముసహితము రక్షింపవలయును.

విదూ—గౌతముఁడు మిమ్ముసహితము కాచుచుండును.

వకు—(రహస్యముగా) అయ్యా! గౌతమా! నేను గనఁబడక దాగియుండెదను. నీవు ద్వారరక్షకుఁడవుకమ్ము.

విదూ—మంచిది.

వకు—(నిష్క్రమించుచున్నది.)

విదూ—ఇంతలోపల నేనీస్ఫటికశిలావేదికమీఁద బరుండెదను. ఓహో! ఈశిలావేదిక యెంతసుఖస్పర్శనిచ్చుచున్నది. (అనికూరుచుండినిద్రపోవుచున్నాఁడు.)

మాళ—(భయముచేత వడఁకుచున్నది.)

రాజు—గీ. భయమువిడువుము ననుఁగూడ, భాసురాంగి!
తడవునీపయిఁ బ్రణయంబు తగిలియుండి
నేను సహకారతను నిందు బూనినాఁడ;
నల్లుకొను మాధవీలత వగుమునీవు.

మాళ—దేవిగారివలనిభీతిచేత నాకుఁబ్రియమైనపనినైనను జేసికొనజాలకున్నాను.

రాజు—నీవు భయపడవలసినపనిలేదు.

మాళ—నన్నుభయపడవలదని యుపదేశించెడుభర్తగారిధైర్యమును వెనుక నేనిరావతియెడఁ జూచియున్నాను.

రాజు—గీ. కీరవాణిరో! వినుము దాక్షిణ్యమెపుడు
క్షితిని నాయకులకుఁ గులవ్రతముసుమ్ము;
అట్టులయ్యు, నాప్రాణంబులాయతాక్షి!
నిన్నె యాశించుకొని నిల్చియున్న విపుడు.

కాఁబట్టి చిరానురక్తుఁడనయియున్న నన్ననుగ్రహియింపవలెను. (అని కౌఁగిలించుకొనఁబోవుచున్నాఁడు.)

మాళ—(తప్పించుకొనుచున్నది.)

రాజు—(తనలో) క్రొత్త కామినుల మదనవిషయమయినయవస్థ మిక్కిలి రమణీయముగా నుండునుగదా?

మ. రశనాబంధము విప్పఁ బ్రేళ్ళుడుకు కార్పం జేయికంపించు, ర
హ్యాశయంబుల్ చనుకప్పులొ బలిమిమై నాశ్లేషమం జేయఁబో
భృశము న్మర్దిడఁబోవఁ గన్నులకుఁ గెంపిప్పు న్ముఖంబోరగా
వశమయ్యె న్సుఖ మిచ్చు కన్యకడుగ నీవ్యాజంబుచే నైననున్.

[అప్పుడిరావతియు నిపుణికయుఁ బ్రవేశించుచున్నారు.]

ఇరా—ఓసీ! నిపుణికా! సముద్రగృహముయొక్క తలవాకిట గౌతముఁడు కనఁబడినాఁడని చంద్రిక నీతో నిజముగా చెప్పినదా?

నిపు—చెప్పకపోయినయెడల అమ్మగారితో నేనేల విన్నపము చేయుదును.

ఇరా—అట్లయినచోఁ, బ్రాణసంశయమునుండి విముక్తుఁడయినభర్తగారిప్రియమిత్రుని క్షేమవార్త యడుగుటకును మనమక్కడకుఁ బోదము.

నిపు—మీమాటవలనమఱియేదో పనికూఁడనని తోఁచుచున్నది.

ఇరా—అవును. చిత్రపటమునందున్న భర్తగారిని బ్రసన్నునిగాఁ జేసికొనుటకును.

నిపు—నీవు కేవల భర్తగారినే యేల ప్రసన్నుని జేసికొనరాదు?

ఇరా—సుందరాలా! మనస్సుమరియొకరిమీఁదికిఁ బాఱియున్న భర్తగారు చిత్రపటమునం దెట్లున్నారో యట్లేయున్నారు. నా ప్రయత్నమంతయు నుపచారమతిక్రమించి వచ్చిననాలోపమును బాపుకొనుటకొఱకే.

నిపు—అమ్మా! ఇటు. ఇటు. (ఇద్దఱును నడుచుచున్నారు.)

[ఒకచేటిక ప్రవేశించుచున్నది.]

చేటి—అమ్మా! నీకు శుభమగుఁగాక! "ఇది మనకు మత్సరమునకుఁ గాలము కాదు. నీయెడఁగలగౌరవమును గనఁబఱుచుకొనుటకొఱకే నేనిప్పుడుసఖీసహితముగా మాళవికకు సంకెళ్ళువేయించుచున్నాను. వారిని విడిపించి భర్తగారికిఁ బ్రియము చేయుటకు నీవనుమతించినయెడల, ఆప్రకారముగాఁ జేసెదను. నీయిష్టమేమోనాకుఁ జెప్పి పంపుము." అని దేవిగారు నీతోఁ జెప్పుమన్నారు.

ఇరా—నాగరికా! "దేవిగారి కీప్రకారము చేయుమని నియోగించుటకు నే నెంతటిదానను? పరిజనులను శిక్షించుటచేత దేవిగారు నాయందు గొప్ప యనుగ్రహ

ము చూపినాను. నేనమ్మాత్రమెవరి యనుగ్రహమువలన వర్ధిల్లినదానను? అని దేవి గారికి విన్నపము సేయుము.

చేటి—అలాగే. (అని నిష్క్రమించుచున్నది.)

నిపు—(కొంచెమునడిచి చూచి) ఆమిగో గౌతముఁడు సముద్రగృహద్వారమున సందంగడిలోని యాఁబోతువలెనే కూరుచుండి నిద్రపోవుచున్నాఁడు.

ఇరా—ఇతనికి చిన్నఁగాఁ గుదురలేదా యేమి? ఇంకను విషవికారము మున్నవాని వలెనే కనఁబడుచున్నాఁడు.

నిపు—ముఖవర్ణము ప్రసన్నమయియే కనఁబడుచున్నది. అదిగాక ధ్రువసిద్ధి చికిత్సచేసినాఁడు. అందుచేత మనమితని కొకకీడు కలుగునని శంకింపవలసిన పనిలేదు.

విదూ—(పలవరించుచున్నాఁడు) అమ్మా! మాళవికా!

నిపు—అమ్మా! వింటివా! యితఁ డెవరికాపుఁడో? ఈకృతఘ్నుఁడు కేవల కుక్షింభరణ పరాయణుఁడు. ఎల్లప్పుడును మనవద్ద స్వస్తివచనమోదకములచేతఁ గడుపు నింపుకొనుచు, యిప్పుడు మాళవికయని పలవరించుచున్నాఁడు.

విదూ—మాళవికా! ఇరావతిని మించినదానవుకమ్ము.

నిపు—ఏమి! ఈప్రలాపము. పామన్న భయపడెడి యీబ్రాహ్మణాధముని పామువలె వంకరగానున్న యీకఱ్ఱతో స్తంభముచాటున దాఁగియుండి భయపెట్టెదను.

ఇరా—ఈకృతఘ్నుఁడు పాముకఱువవలసినవాఁడే.

నిపు—(విదూషకునిమీఁద దండకాష్ఠమును బడవేయుచున్నది.)

విదూ—(ఉలికిపడిలేచి) అయ్యో! మిత్రుఁడా! నామీఁదఁ బాముపడ్డది.

రాజు—(తొందరపడివచ్చి) భయపడకు! భయపడకు.

మాళ—(వెనుకనుంచి) భర్తా! పామనుచున్నాఁడు. సాహసముచేసిపోవలదు.

ఇరా—అయ్యో! భర్తకూడ నీలాగుననే వచ్చుచున్నాఁడు.

విదూ—(పెద్దపెట్టున నవ్వి) ఇదియు దండకాష్ఠమేనా? నేనప్పుడు మొగలి ముండ్లతో గీచుకొని పాముకఱచినదని బొంకినదానికి ఫలమే యిప్పుడు కలిగినదను కొన్నాను.

[అప్పుడు తెరవెనుకనుండి వకుళావళిక ప్రవేశించుచున్నది.]

వకు—భర్తగారు రావలదు. ఇక్కడ సర్పమువలెనే కుటిలవ[illegible] కనఁబడుచున్నది.

ఇరా—(వేగముగా రాజుగారి వద్దకునడిచి) దంపతులయొక్క దివాసంకేతము నిర్విఘ్నముగా నెరవేరినదా?

[ఇరావతినిజూచి యందఱును భ్రాంతులగుచున్నారు.]

రాజు—ప్రియురాలా! ఈయుపచార మపూర్వమయినది కదా?

ఇరా—బకుళావళికా! భర్తగారి దూతికవయి నీప్రతిజ్ఞ యిప్పుడు సంపూర్ణ మయినదా?

బకు—అమ్మా! శాంతింపుము. నేనేమి చేసితి? మారాజుగారి ననుగమన్నప్పుడు కప్పలు కూయునని దేవుఁడు భూమిమీఁద వర్షము కురిపింపకుండునా?

విదూ—నీవీలాగున సెలవీయఁబోకు. పాదములమీఁదఁ బడినను నీకోపము శమించి పోయినసంగతి దర్శనమాత్రముచేతనే యెఱుఁగుదు మహారాజుగారు నీవిప్పుడయి నను ప్రసాదము జూపకున్నావు.

రాజు—ఈప్రకారము నిష్కారణముగాఁ గోపపడుట నీకుఁదగదు.

గీ. నిర్నిమిత్తంబ తృణమేని నీముఖంబు
పడఁతి, యెప్పుడు మును కోపపాత్రియయ్యె?
పర్వమునఁ గాక చంద్రబింబంబు రాహు
కలుష మెట్లొనోకో రాత్రి తెలుపుమీవు.

ఇరా—నిష్కారణముగానని భర్తగారు చక్కఁగా సెలవిచ్చినారు! నాభాగ్యము న్యుల పాలయినప్పుడు నేనుమరలఁ గోపపడిన పక్షమున నేనే హాస్యాస్పదురాల నగుదునుగదా?

రాజు—నీవన్యవిధముగాఁ గల్పించుకొనుచున్నావు. నాకు నిజముగా నీకోపమునకు హేతువు కనఁబడకున్నది. ఎట్లన—

గీ. పండుగదినంబులందునఁ బరిజనంబు
తప్పుగల్గియుఁ జెఱనుండఁ దగదటంచు
వీరి నెవిడిపింప; నక్కఁ జేరి మ్రొక్క-
వీరువచ్చి రింతియకాని వేఱులేదు.

ఇరా—నిపుణికా! నీవుపోయి మాపక్షపాతము కనిపెట్టితివని దేవిగారితో విన్నవింపుము.

నిపు—అలాగే. (అని పోవుచున్నది.)

విదూ—(తనలో) అనర్థము సంభవించినది. బంధమునుండి తప్పించుకొన్న యింటిపావురము పిల్లికంటఁ బడినదిగదా?

నిపు—(మరలఁబ్రవేశించి) అమ్మా! దైవికముగా నాకిప్పుడు మాధవిక కనఁబడి దీనికి హేతువిదియని చెప్పినది. (అని చెవిలోఁ జెప్పుచున్నది.)

ఇరా—(తనలో) నాకెంతయు బోధపడదు. ఇదియంతయు నీతుచ్ఛబ్రాహ్మణుఁడు పన్నిన పన్నుగడ (విదూషకుని జూచి తిరస్కారముగా) యిప్పుడిది యీకామతంత్రమంత్రిగారు ప్రయోగించినరీతి.

విదూ—అమ్మా! నేను నీతియందొక యక్షరమైనను జదివియుండినచో యిట్లు రాజుగారి నాశ్రయించుకొని తిరుగుదునా?

రాజా—(రహస్యముగా) అకటకటా! నేనిప్పు డీవిపత్తునుండి యెట్లు విముక్తి నొందుదును?

[వేగముగా జయసేన ప్రవేశించుచున్నది.]

జయ—దేవా! మీకొమార్తె వసులక్ష్మి బంతినిమిత్తమయి పరుగెత్తుచు, పండుకోఁతి వచ్చి బెదరింపఁగా మిక్కిలి జడిసికొన్నది. ఆమెను దేవిగారు తమ యొడిలోఁ బెట్టుకొని కూరుచున్నను గొంచెమయినను జ్ఞప్తిరాక పెద్దగాలిలోఁ గదులుచున్న చిగురాకువలె వడఁకుచున్నది.

రాజా—అయ్యో! అయ్యో! పసిపిల్ల లెంతపిరికివారు!

ఇరా—(తొట్రుపాటుతో) ఆచిన్నదాని నోదార్చుటకయి భర్తగారు వేగిరము విజయంచేయవలెను. ఆమెకు సంతానజనితమయిన వికారము వృద్ధిపొందకుండ వారింపవలెను.

రాజా—నేనుబోయి జ్ఞప్తివచ్చునట్లు చేసెదను. (అని వేగముగాఁ బోవుచున్నాఁడు)

విదూ—మేలు! ఓరిపింగళవానరా! మేలు! నీవు స్వపక్షమువారిని రక్షించినావు.

[రాజును, విదూషకుఁడును, ఇరావతియు, నిపుణికయు, నిష్క్రమించుచున్నారు.]

మాళ—దేవిని దలఁచుకొని నాహృదయము కంపమొందుచున్నది. నాకిప్పు డేమి సంప్రాప్తము కానున్నదో తెలియకున్నాను.

తెరలో—ఆశ్చర్యము! ఆశ్చర్యము! దోహదము చేసి యయిదురాత్రులయినను గడవకమునుపే కాంచనాశోకము మొగ్గలతో నిండిపోయినది. ఈసంగతి దేవిగారికి నివేదించెదను.

ఇద్దఱు—(విని సంతోషించుచున్నారు.)

వకు—సఖీ! ఊఱటపొందుము. దేవి తాను జేసినప్రతిజ్ఞ తప్పదు.

మాళ—అట్లయినయెడల నుద్యానపాలికవెనుకనే పోవుదము.

వకు—అలాగే చేయుదము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



# పంచమాంకము.

[అప్పుడుద్యానవనపాలకురాలు ప్రవేశించుచున్నది.]

ఉద్యా—నేను గౌరవపూర్వకముగాఁ గాంచనాశోకముచుట్టును గోడపురఁ గును చేసినాను. వారు నియోగించిన యీపనిని జేసితినని దేవిగారికి నివేదించెదను. ఇఁకవిధి మాళవికయందు దయచూపవచ్చును. అప్రకారముగాఁ గుపితురాలయి యున్న దేవియిప్పుడీసంతోషకరమయిన యశోకదోహదవృత్తాంతముచేతఁ బ్రసన్నురాలగును. దేవియిప్పు డెక్కడనుండియుండును? ఆహా! అదిగో దేవిగారి పరిచారకుఁడయిన కుబ్జుడొకఁడు చతుశ్శాలనుండి వచ్చుచున్నాఁడు. అతనినడిగెదను.

[అప్పుడు చేతియందుఁ బెట్టె పట్టుకొని కుబ్జుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

(ముందుకు నడిచి) సారసా! ఎక్కడకుఁ బోవుచున్నావు?

సార—మధుకరికా! విద్వాంసులయిన బ్రాహ్మణుల కియ్యవలసిన నెలదినముల నిత్యదక్షిణను పూజ్యుఁడయిన పురోహితునిచేతికిచ్చి వచ్చుటకయి పోవుచున్నాను.

మధు—అది యెందునిమిత్తము?

సార—రాజుగారి కుమారుఁడు యజ్ఞాశ్వమును రక్షించుటకయి సేనాపతిచేత నియోగింపఁ బడినాఁడని వినినప్పటినుండియు, అతని యాయుర్వృద్ధికొఱ కష్టశత సువర్ణపరిమాణధనము దక్షిణగా నిచ్చుటకు దేవిగారు ప్రతిజ్ఞ చేసినారు.

మధు—ఇప్పుడు దేవి యెక్కడనున్నది?

సార—మంగళగృహమునందుఁ బీఠముమీఁదఁ గూరుచుండి విదర్భదేశమునుండి తనతమ్ముఁడయిన వీరసేనుఁడు పంపిన కమ్మను లిపికారులచేతఁ జదివించి వినుచున్నది.

మధు—మరల విదర్భరాజు వృత్తాంతమేమయినఁ దెలిసినదా?

సార—విదర్భరాజు వీరసేనునిక్రిందనున్న సేనాచక్రముచేతలోఁబఱచుకొనఁ బడినాఁడు; అతని దాయాదుఁడయిన మాధవసేనుఁడును చెఱనుండి విడిపింపఁబడినాఁడు. అతఁడు దూతవెంట ముందుగా శ్రేష్ఠములయిన రత్నవాహనములను శిల్పవిద్యాప్రవీణతగల పరిజనమును రాజుగారికిఁ గానుకగాఁబంపి, తాను వెనుకవచ్చి ప్రభువారిని దర్శనము చేసికొనఁబోవుచున్నాఁడు.

మధు—నీవు పోయి నీపనిని జేయుము. నేనును దేవిగారిని సందర్శింపఁ బోయెదను.

(అని యిద్దఱును బోవుచున్నారు.

ఇది ప్రవేశకము.

—:o:—

[అప్పుడు ప్రతిహారి ప్రవేశించుచున్నది.]

ప్రతీ—అశోకసత్కారోత్సుకురాలయి యున్న దేవి "భర్తగారితోఁగలిసి నేన శోకవృక్షముయొక్క పుష్పసంపదను జూడఁగోరుచున్నాను" అని రాజుగారికి విన్నవింపుమని నాకాజ్ఞయిచ్చినది. కాఁబట్టి ధర్మాసనమునకు విజయంచేసెడు రాజుగారిరాకకయి నేను బ్రతీక్షించి యుండెదను. (అనితిరుగుచున్నది.)

తెరలో వైతాళికులు—ఓహో! రాజదండము చేతశత్రుశిరస్సులమీఁదపడ్రించుచున్నాఁడు!

ప్రథముఁడు—చ. పరభృతకుస్వరంబు తనుపన్ విదిశానదిపొంతఁదోటలో
వరరతితోడ రూపము సపంచశరుండును బోలె హాయిగా
విరళవసంత మీ రనుభవింపఁగ నిద్ధబలుండవైన నీ
యరి వరదానదీపరిసరాటవులన్ భవదీయభద్రకుం
జరములఁ గట్టిమహీజంబులతో వహించుచున్ గాలన్.

ద్వితీయుఁడు—చ. ధరణి విదర్భునిన్ దడముతాఁకున గెల్చినచిత్రమున్,
బరిఘులవంటి బాహువులబల్మిని రుక్మిణిఁగొన్నకృష్ణు స
చ్చరితముఁ, బద్యరూపమున నల్పి సురోపములైన పండితుల్
కరముఁ బఠింతు రల్లకధకైశకధిక్కృతి వీరతుష్టికిన్

ప్రతీ—అదె జయశబ్దము ప్రస్థానమును దెలుపఁగా రాజుగారిచ్చటికి విజయం చేయుచున్నారు. నేనుగొంచెమాయనయెదుటనుండి తొలఁగి, ముఖద్వారతోరణము నాశ్రయించి నిలిచెదను. (అని చాటున నిలుచున్నది.)

[అప్పుడు మిత్రసహితముగా రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—గీ. అకట! ప్రియురాలుదుర్లభ యాటతలఁచి,
బలముచే విదర్భుఁడు గెల్వఁబడుట వినియు,
వానచే నెండచేఁ గొట్టఁబడినతమ్మిఁ
బోలి, దుఃఖమును సుఖంబుఁ బొందుమనసు.

విదూ—నీవత్యంతసుఖవంతుఁడ వగుదువని నామనస్సునకుఁ బొడకట్టుచున్నది.

రాజు—ఏలాగున?

విదూ—ఇంతకుముందే ధారణీదేవి "అమ్మా! నీవలంకరించుటయందు సాటిలేనిదానవని గర్వపడుచుందువుగనుక వివాహాలంకార రచనయందలి నీనేర్పు నిప్పుడు మాళవిక శరీరముమీఁదఁ గనఁబఱుపుము" అనిపండితకౌశికితోఁ జెప్పినది. అందుచేత నామె విశేష కౌతూహలముతో మాళవిక నలంకరించినది. దేవి నీమనోరథము నెఱవేర్చునేమో!

రాజు—మిత్రుఁడా! ఎప్పటికిని నాయిష్టము ననుసరించి సంచరించెడు ధారణీ దేవియొక్క పూర్వచరితము విచారింపఁగా నీవు చెప్పినట్లు జరగ నేరచ్చును.

ప్రతీ—(ప్రవేశించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! కాంచనాశోకముయొక్క పుష్పోద్గమసంపదను భర్తగారితోఁగూడ సందర్శింపఁగోరుచున్నా— దేవిగారు విన్నపము చేయుచున్నారు.

రాజు—దేవి యక్కడనేయున్నదా?

ప్రతీ—అవును. వారివారి కర్హమైన సమ్మానము చేసి యంతఃపురజనమును బంపివేసి పరిజనముతో మాళవికముందు నడువఁగా దేవి తాను దేవరవారిరాకకయి, నిరీక్షించుచున్నది.

రాజు—(సంతోషముతో విదూషకునివంకఁజూచి) జయసేనా! నీవు ముందు నడువు.

ప్రతీ—దేవా! రండిరండి. (అని నడుచుచున్నది)

విదూ—(చూచి) ఓమిత్రుఁడా! వసంతుఁడీయుద్యానవనమునందుఁగొంచెము యౌవనదశను బొందినవానివలెఁ గనఁబడుచున్నాఁడు.

రాజు—నీవన్న మాట సత్యము.

గీ. వంగి కురువకఫలజాలభారమునను
జాతభూరుహ మల్లదె చూడు మెదుట
రహిని నీఋతుయౌవనారంభమునఁగ
మదికి నుత్కంఠ గొలిపెడు మరియుమరియు.

విదూ—మిత్రుఁడా! అదిగో కాంచనాశోకమలంకారము చేసికొన్నదానివలెఁ బూవుగుత్తులచేత నొప్పుచున్నది దేవరవారు చిత్తగించవలెను.

రాజు—ఇప్పుడిది యనన్యసాధారణమయిన శోభను వహించుచున్నదిగనుక యాలస్యముగాఁ బూఁతపట్టుటయే యుక్తముగానున్నది చూడు—

గీ. మొదలను వసంతవిభవంబు పూనినట్టి
సకలసుందరాశోకవృక్షములసొంపు
దోహదమునొందియున్న యీద్రుమమునందె
సంక్రమించెననఁగ మొగ్గచాలు పొలుచు.

విదూ—నిశ్చయముగా నీవుసంతుష్టుఁడవుకమ్ము. మనమీప్రకారముగా సమీపమునకు వచ్చియున్నను, ధారణీదేవి తనపార్శ్వమునందున్న మాళవిక నిలుచుట కనుమతించుచున్నది.

రాజా—(సంతోషముతో) సఖుఁడా! చూచుచున్నాను.

క. వినయమునం బ్రియురాలటు
వెనుకఁ గరాబ్జములుసాఁచి వేడ్కను నిలువన్
ననుదేవియెదుర్కొనియెడుఁ
బొనరఁగ నృపలక్ష్మితోడి భూదేవియనన్.

[అప్పుడు మాళవికయు, ధారణీదేవియు, పరివ్రాజికయు, అర్హపరివారమును,
ప్రవేశించుచున్నారు.]

మాళ—(తనలో) నాకౌతుకాలంకారమునకు హేతు వెఱుఁగుదును. అయినను నా హృదయము తామరాకులోని నీటివలెఁ దల్లడిల్లుచున్నది. నాయెడమకన్ను బలుమా అదరుచున్నది.

విదూ—ఓహో! మిత్రుఁడా! వివాహాలంకారము చేతఁ బూజ్యురాలయిన యీ మాళవిక మిక్కిలి శోభిల్లుచున్నది గదా?

రాజా—అవును జూచుచున్నాను.

గీ. చాలవ్రేలెడిపట్టు వస్త్రంబు గట్టి
మితవిభూషణములతోడ మెఱయు నీమె
హిమము గ్రమ్మని నక్షత్రసమితితోడఁ
బ్రబలచంద్రికగల చైత్రరాత్రిఁబోలి.

ధార—(సమీపించి) ప్రాణేశ్వరా! జయమగుఁగాక! జయమగుఁగాక!

విదూ—అమ్మా! వర్ధిల్లుము.

పరి—దేవా! విజయమగుఁగాక!

రాజా—అమ్మా! నమస్కరించుచున్నాను.

పరి—అభీష్టసిద్ధి యగుఁగాక!

ధార—(చిఱునవ్వునవ్వి) ప్రాణేశ్వరా! తరుణీజనసహాయుఁడవయిన నీకీయశోకవృక్షము మాచేత సంకేతగృహముగాఁ జేయఁబడినది.

విదూ—మిత్రుఁడా! నీవు సత్కరింపఁబడినావు.

రాజా—(సిగ్గుతో అశోకమువంకఁ దిరిగి)

గీ. అలవసంతనియోగ మనాదరించి
యీదినంబె నీదు ప్రయత్న మలరఁబూని
కావునను నిట్టిదేవి సత్కారమునకు
నియ్యశోక మ్మగత నేల యొనయకుండు?

ఇద్ద—(కూరుచున్నారు.)

రాజు—ఏ కళావిద్యయందభినివేశము గలదు?

ఇద్ద—దేవా! సంగీతవిద్యయందు.

రాజు—దేవీ, వీరిలో నొకదానినీవు తీసికొమ్ము.

ధారి—మాళవికా! వీరిలో సమర్థురాలయిన యువతిని సంగీతమునకు సహాయురాలినిగాఁ దీసికొనుటకు నీకిష్టము గానున్నదా?

ఇద్ద—(మాళవికను జూచి) ఓహో! రాజపుత్రిక! రాజపుత్రీ! జయము గలుఁగాక జయము గలుఁగాక! (అని నమస్కరించి యామెతోఁగూడఁ గన్నీరు విడుచుచున్నారు.)

అందఱు—(ఆశ్చర్యపడి చూచుచున్నారు.)

రాజు—కాంతలారా! ఈమె యెవరు?

ఇద్ద—ఈమె మా రాజుగారి కొమార్తె.

రాజు—ఏలాగున?

ప్రథమ—దేవా! దేవరవారి దండనాధులచేత విదర్భరాజును లోఁబఱుచుకొని చెరసాలనుండి విడిపించిన మాధవసేనుఁడను రాజకుమారునకుఁ జెల్లెలయిన మాళవిక యీమె.

ధారి—ఏమీ! యీమె రాజపుత్రికా? మంచిగంధపుఁజెక్క నాచేఁ బాదుకగా నుపయోగింపఁబడి దూషితమయినది.

రాజు—ఈమెకీదశ యెట్లు సంభవించినది?

మాళ—(నిట్టూర్పువిడిచి తనలో) విధినియోగముచేత.

ద్వితీయ—దేవరవారువినవలెను. మా రాజకుమారుఁడయినమాధవసేనుఁడు దాయాదుని వశముఁ జిక్కఁగా నాతనిమంత్రియైన సుమతి మాబోఁటిపరిజనమునువిడిచిపెట్టి యీమెను రహస్యముగాఁ దీసికొనిపోయినాఁడు.

రాజు—ఇంతవఱకు మేమీవఱకే వినియున్నాము. అటుతరువాత?

ద్వితీ—దేవా! అటుతరువాతజరిగినదిమాకు తెలియదు.

పరి—అటుతరువాత జరిగినది మందభాగ్యురాలనయిన నేను వినిపించెదను.

ఇద్ద—రాజపుత్రీ! ఈకంఠస్వరము పూజ్యురాలయినకౌశికదివలెనున్నది. ఆమె కాదుగదా?

మాళ—అవును. ఆమెయే.

ఇద్ద—యతివేషధారిణియైయున్న యీమె నిప్పుడానవాలుపట్టుటయే కష్టముగానున్నది.—అమ్మా! నీకు నమస్కారము.

పరి—మీరాయిద్దఱకును శుభమగుఁగాక!

రాజు—అమ్మా! మీరు వీరాప్తవర్గములోనివారా?

పరి—అవును.

విదూ—అట్లయినచో మీరిప్పుడు పూజ్యురాలయిన యీమె వృత్తాంతము సంపూర్ణముగాఁ జెప్పివేయుఁడు.

పరి—(విచారముతో) అంతయు వినుఁడు. మాధవసేనుని మంత్రియయిన సుమతి బాకన్నగారు, తెలిసినదా?

రాజు—తెలిసినది. అటుతరువాత?

పరి—ఈమె తోడఁబుట్టినవాఁడావిధమయి పోఁగా గూఢముగా నీమెను వెంటఁబెట్టుకొని తనతో సంబంధము చేయవలెనను కోరిక తోఁచఁడు విదిశానగరమునకు వచ్చుచున్న సార్థవాహులతో బయలుదేఱినాఁడు.

రాజు—అటుపిమ్మట?

పరి—అతఁడును దారినడచిన వణిక్సమూహమువలెనే యడవిలోఁ బ్రవేశించి విశ్రాంతి పొందుట కారంభించెను.

రాజు—ఆపయిని మఱియేమున్నది?

ఉ. బాహులమధ్యఁ దూణములపట్టములిట్టటు కట్టియుండ, గా
త్సాహము పుట్టఁ బాదములదాఁకను వ్రేలఁగ బర్హిబర్హముల్
సాహసలీల నార్చుచును చాపములన్ ధరియించి, ఘోర సం
దోహము చేయుమాత్రమున దుస్సహమై కనుపట్టె నవ్వడిన్.

మాళ—(భయము కనఁబఱుచుచున్నది.)

విదూ—అమ్మా! భయపడఁబోకు. ఈమె యిరావతికి జరిగినకథనే చెప్పుచున్నది.

రాజు—తరువాత. తరువాత.

పరి—అప్పుడు బద్ధాయుధులయిన సార్థవాహయోధులు ముహూర్తకాలములో దొంగలచేతఁ దఱుమఁగొట్టఁబడినారు.

రాజు—అమ్మా! పాపము! ఇఁకఁ జెప్పఁబోవునది కష్టకథ కాఁబోలును!

పరి—అటుతరువాత నాసోదరుఁడు——

గీ. అదురాత్ములచేతఁ గీడడరునంచు
భయపడుచునున్న యీమెఁ గాపాడుకొఱకుఁ
దాను ప్రభుభక్తి మెరయ దుస్త్యజములైన
ప్రాణములనిచ్చి తీర్చెఁబో స్వామిఋణము.

ప్రథమ — కటకటా! సుమతి హతుండయ్యెనా?

ద్వితీయ — అందుచేతనే యీ రాజపుత్రిక కిట్టి యవస్థపట్టినది.

పరి — (కన్నుల నీరొలుకుచున్నది.)

రాజు — అమ్మా! శరీరము లశాశ్వతములని వారిలోకయాత్ర యిట్టుండుటచే. తాను ప్రభుభక్తిని సఫలము కావించుకొన్న యా పుణ్యాత్మునిగూర్చి శోకింపవలసిన పనిలేదు.

పరి — సేనాపతి మూర్ఛపోయి మరలఁ దెలివి తెచ్చుకొనునంతలో నీమె కంటికి గనఁబడకపోయినది.

రాజు — అప్పుడమ్మగారనుభవించిన కష్టము మహాత్తరమైనదయియుండును.

పరి — అప్పుడు నేనన్నగారిశరీరమున కగ్నిసంస్కారము చేసి, మరలఁ గ్రొత్తగాఁ బొందిన వైధవ్యదుఃఖముతోఁ గాషాయవస్త్రములను ధరించి మీదేశము ప్రవేశించినాను.

రాజు — సజ్జనులకీమార్గము యుక్తమైనదే. ఆపయిని!

పరి — ఆపయి నీమె యాకిరాతులనుండి వీరసేనునివద్దకును, వీరసేనునినుండి దేవిగారియొద్దకును వచ్చినది. దేవిగారి గృహమునందుఁ బ్రవేశము దొరకినతరువాత నాకీమె కానఁబడినది. నాకథ యింతటితో సరి.

మాళ — (తనలో) భర్తగా రిప్పుడేమి చెప్పునో?

రాజు — ఓహో! ఆపద లెప్పుడును పరాభవమును దెచ్చునుగదా! ఎట్లనిన —

అకట! దేవికా నర్హురాలయిన నీమె
దాసిగాఁ జేయఁబడె నింతదనుక నిందు
అనుగఁ దెలిపట్టుపుట్టంబు తెలిచి మాలి
వాఁడు దలంటుగుడ్డగఁ జేయఁబడినయట్లు.

ధార — అమ్మా! మాళవిక గొప్పవంశమునఁ బుట్టినదని యింతవఱకును జెప్పక నీవు తప్పుచేసితివి.

పరి — పాపము శమించునుగాక! నేను గారణముండియే యీసంగతి రహస్యముగానుంచినాను.

ధార — ఆ కారణమేది?

పరి — ఈమె తండ్రి జీవించియుండఁగాఁ దీర్థయాత్రపరుఁడయి సిద్ధాదేశముచేత వచ్చినయొక సాధు వీమె సంవత్సరమాత్రము దాస్యము ననుభవించి తరువాతఁ దగిన భర్తను బొందునని చెప్పెను. అదియవశ్యముగా ననుభవింపవలసినదని యెంచి మీ

కాతదేవతా వంతలకమ్మోడి యామిమొలక్కా యామాలావధిని బ్రతీక్షించుచుంటిని. ఇట్లు చేయుట యుచితమని నేను భావించెదను.

రాజా — అట్లు ప్రతీక్షించుట మంచిపనియే.

కంచు — దేవా! విదర్భదేశవ్యవహారవిషయమును జేయవలసినదేమో ప్రభువువారి యభిప్రాయమును వినఁగోరుచున్నానని మంత్రి మనవిచేయుచున్నాఁడు. మీరు ప్రసంగాంతరములో నుండుటచేత మాకువిన్నవించుట కవకాశము చిక్కినదికాదు.

రాజా — మౌద్గల్యా! అన్నదమ్ములయిన యీయజ్ఞసేన మాధవసేనులకు రాజ్యము రెండుభాగములుగాఁ బంచియిచ్చి యిప్పుడు వారినిద్దఱిని రాజ్యమునందు నిలుపఁగోరుచున్నాను.

గీ. వరదకు త్తరదక్షిణ భాగములను
వారు పాలించుకొనవలెను వేఱు వేఱ
వరుసగా నలచంద్రభాస్కరులు తాము
రేయి పగలును బాలించు రీతిగాను.

కంచు — దేవా! నేనిది మంత్రిసభకు విన్నపము చేసెదను.

రాజా — (వ్రేలితో ననుమతిని గనఁబఱచుచున్నాఁడు.)

కంచు — (నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రథమ — (రహస్యముగా) ఓ రాజపుత్రీ! భాగ్యవశముచేత నీయన్నగారు అర్ధరాజ్యమునఁ బ్రతిష్ఠింపఁబడుచున్నాఁడు.

మాళ — జీవితసంశయదశనుండి విడిపింపఁబడినందునకే మనము సంతోషింపవలయును.

[కంచుకి మరలఁబ్రవేశించుచున్నాఁడు.]

కంచు — దేవా! విజయమగునుగాక! దేవరవారియాజ్ఞ మంగళప్రదమయినదని మంత్రిమనవిచేయుచున్నాఁడు. మంత్రి సభవారును తామీప్రకారముగానిశ్చయించినారు.

చ. సిరిఁగయికొన్న యాతఁడలక్ష్మిని దయచొప్పరలంగ నిద్దరన్,
బహుఫలదాశ్వములు మెడలపైని వహించెడునట్లు, వారిపై
దిరుపును వంకమీఁద నితరేతరవైరము మాని, యోనరే
శ్వర! భవదీయశాసనముఁబట్టి మెలంగుచునుండు రెప్పుడున్.

రాజా — అట్లయినపక్షమున సేనాపతియైన వీరసేనున కీవిధముగాఁ జేయుమని లేఖ వ్రాసిపంపవలసినదని మంత్రిసభకుఁ జెప్పుము.

కంచు — దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని వెడలిపోయి, ఒక లేఖయుఁ

గానుకయుఁ బట్టుకొని హరలఁ (బకోరుచున్నాఁడు) ప్రభువుగారియాజ్ఞ జరపఁబడినది. ఇదిగో సేనాపతియైన పుష్పమిత్రునియొద్దనుండి బహుమానముగాఁ బంపఁబడిన యుత్తరీయములోఁగూడ నీలేఖ వచ్చినది. ప్రభువువారు దీనిని జిత్తగింతురుగాక!

రాజు—(లేచి, బహుమానము నుపచార పూర్వకముగా గ్రహించి, పరిజనము చేతి కిచ్చి, లేఖను విప్పుచున్నాఁడు.)

ధారి—ఆహా! నామనస్సు లేఖమీఁదనే యున్నది. గురుజనక్షేమము తెలిసికొన్న పిమ్మట వసుమిత్రునివృత్తాంతము వినెదను. సేనాపతి నాపుత్రునిమీఁద నతిభారమును మోపినాఁడు.

రాజు—(కూరుచుండి చదువుచున్నాఁడు.) శ్రీరస్తు! విదిశానగరమునందున్న చిరంజీవియైన మాపుత్రుఁడగు నగ్నిమిత్రుని సేనాపతియైన పుష్పమిత్రుఁడు ప్రేమపూర్వకముగా నాలింగనము చేసికొని యజ్ఞశాలనుండి పుత్తెంచిన పత్రిక. నేను రాజయజ్ఞదీక్షితుఁడనయియుండి నూఱుగురు రాజపుత్రులను దోడిచ్చి మనవసుమిత్రునిఁ దురంగరక్షణార్థము సంవత్సరము క్రిందట నియోగించి తన మనసువచ్చినట్లుగా సంచరించుటకయి గుఱ్ఱమును విడిచిపెట్టితిని. అది సింధునది దక్షిణతీరమునఁ దిరుగుచుండఁగా దాని నశ్వసేనాధిపతియైన యొకయవనుఁడు పట్టుకొనెను. అప్పుడుభయసేనలకును ఘోరయుద్ధము సంభవించెనని తెలియునది.

ధారి—(విషాదమును గనఁబఱచుచున్నది.)

రాజు—ఏమీ! ఈవిధముగా జరగినదా?

“గీ. అతులధన్వియౌ వసుమిత్రుఁ డడరి యవను
చెదరఁగాఁ దోలి శత్రుల సిగ్గుపఱచి
వడిగ నాయుత్తమాశ్వంబు బలిమితోడఁ
దాను మరలించి తెచ్చె నిత్తావునకును.”

ధారి—ఈవాక్యముచేత నాహృదయము చల్లపడినది.

రాజు—(మిగిలిన లేఖను జదువుచున్నాఁడు.) అంశుమంతుఁడు సగరునకశ్వమును దెచ్చి యిచ్చినట్లుగా నాపౌత్రుఁడు నాయజ్ఞాశ్వమును దీసికొనిరాఁగా నే నిప్పుడు చేయఁబూనినయీయజ్ఞమునకు రోషము విడిచినీవు వధూజనసహితముగా యుక్తసమయమున రావలెను.

రాజు—నాకిదియనుగ్రహము.

పరి—భాగ్యవశమునఁ బుత్రవిజయము చేత దంపతులు వర్ధిల్లుచున్నారు. (ధారిణిం జూచి)

